ఉపనిషత్తులు

వేదములు-అపౌరుషేయాలు. అంటే తపస్సు చేయుచున్న ఋషులకు, పరమాత్మ ద్వారా కేవలం, ఉదాత్త, అనుదాత్త స్వరములతో మాత్రమే వినిపించేవి. వీటికి లిపి లేదు. ఆ వేదములు ఋషుల ద్వారా మానవాళికి, ఆధ్యాత్మిక ధర్మ సంప్రదాయము లకు ముఖ్య సూత్రములు. సనాత ధర్మమునకు జీవనాడులు. ఈ వేద వేదాంగముల సారమే ఉపనిషత్తులు.

ఉప-ని-షత్ అంటే గురువు వద్ద కూర్చొని నేర్చుకోనేది. వీటినే శృతులు అని అంటారు. ఈ ఉపనిషత్తులు 250 పైనే ఉన్నాయి. కానీ వాటిలో 108 మనకు అందుబాటులో ఉన్నాయి. ఈ 108 లో కూడా ప్రామాణికమైనవి, ప్రాచీనమైనవి 14 మాత్రమే. ఈ 14 ఉపనిషత్తులకు పరమేశ్వరుడు, భూలోకానికి దిగి వచ్చి మన కొరకు ఆచార్యుల రూపాలలో పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ ఆదిశంకరాచార్యులు, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ రామానుజాచార్యులు, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ మధ్వాచార్యులు, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ రమణ మహర్షులు, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర భారతీ సరస్వతీ స్వామి వారు ఇలా ఎందరో మహానుభా వులు వేదములకు, వేద-వేదాంగములకు, ఉపనిషత్తులకు భాష్యం చెప్పారు.

14 ఉపనిషత్తులు.
1. ఋగ్వేదము :– ఐతరేయ ఉపనిషత్తు, కౌషీతకోపనిషత్తు
2. కృష్ణయజుర్వేదము:- తైత్తరీయోపనిషత్తు, కఠఉపనిషత్తు, మైత్రాయనీయోపనిషత్తు, శ్వేతాశ్వరోపనిషత్తు
3. శుక్లయజుర్వేదము:- ఈశావాశ్యకోపనిషత్తు , బృహదారణ్యకోపనిషత్తు
4. సామవేదము:- ఛాదోగ్య ఉపనిషత్తు, కెనోపనిషత్తు
5. అధర్వణవేదము:- ప్రశ్నోపనిషత్తు, మాండుక్యోపనిషత్తు, ముండకోపనిషత్తు, కైవల్యోపనిషత్తు.

ఈ ఉపనిషత్తులలో లేనివి ఈ ప్రపంచంలో లేదు. అన్నీ ప్రశ్నలకు, సమాధానాలకు ఈ వేదాలు ఉపనిషత్తు లు మరియు ఆచార్యులు భాష్యములే ఆధారము. మనిషి తల్లి గర్భ ప్రవేశము నుండి, మరు భూమికి చేరి మరలా జీవుని పరిస్థితిని, కాలగతిని, అన్నీ ఇందులో నిక్షేపింపబడినాయి.
మనకు(దేహానికి) అనారోగ్యము చేసినప్పుడు, డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి డాక్టరుచే సూదులు వేయించుకొని డాక్టరుగారు ఇచ్చిన మందులు వాడుతాము కదా? మరి మన జీవికి (ఆత్మకు) వచ్చిన అనారోగ్యము(అంటే అరిషడ్వర్గములు బాధించే బాధలు జరా-మరణ బాధలు) మాటేమిటి? ఈ అనారోగ్యమునకు పూజ, జపము, ధ్యానములే మందులు. ఈ మందుల మోతాదును ఉపయోగించే విధానమును మనకు తెలియచేయు వైద్యుడే గురువు. ఈ విధముగా గురు ఆజ్ఞ మేరకు మనము ఆ మందులను వాడి, ఆ మందులు మన శరీరంలోని అణువు అణువు నిండి నిమిడీకృత మైతే, ఇక మనలో యున్న ఆత్మకు అనారోగ్యము లేదు.

మన శరీరంలో 72 వేల నాడుల ఉంటాయి.
అందులో 14 నాడులు ముఖ్యమైనవి.:
1) పింగళ,
2) ఇడ
3) సుషుమ్న
4) సరస్వతి
5) పూష
6) వరుణ
7) సప్తజిహ్వ
8) యశస్విని
9) అలంబస
10) కుహు
11) విశ్వోధార

12) పయస్విని
13) గాంధార
14) శుంభి.
ప్రధాన నాడులు. ఇడ,పింగళ, సుషుమ్న. వీటి మూడింటికి త్రిమూర్తులు అధినాయకులు. సుషుమ్న నాడికి కుడిప్రక్క సూర్యనాడి, ఎడమ ప్రక్క చంద్ర నాడి ఉంటాయి. ఈ సూర్య చంద్ర నాడులు కలుపు ప్రదేశమే భ్రూమధ్యము.

ఆజ్ఞాచక్రము:-
సూర్య చంద్ర నాడులు అంతర్ముఖముగా ప్రయాణించి పాలభాగము మీద అర్ధ చంద్రాకృతిలో ఉంటాయి. అపుడు రెండు కనుబొమల మధ్య ఉన్న భ్రూకుటికి ఆజ్ఞా చక్రమని పేరు. ఈ ఆజ్ఞాచక్రము నిలబడి తెరుచుకుంటే దివ్యజ్ఞానము ప్రభాసిస్తుంది. దివ్యదృష్టి కలుగుతుంది.
శ్లో || నాస్తిలోభసమో వ్యాధిః | నాస్తి క్రోధసమోరిపుః
నాస్థిదారిద్ర్యవత్ దుఃఖం | నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్ ||లోభాన్ని మించిన వ్యాధి లేదు, క్రోధాన్ని మించిన శత్రువులు లేరు, దారిద్యాన్ని మించిన దుఃఖం లేదు, జ్ఞానాన్ని,తృప్తిని మించిన సుఖం లేదు.

పంచీకరణము పంచభూతపంచీకరణము

1.ఆకాశము 2. వాయువు 3.అగ్ని 4. జలము 5. భూమి

1.ఆకాశము :- ప్రధానముగా తీసుకొని ½ భాగము ఆకాశము, 1/8భాగము వాయువు,1/8 భాగము అగ్ని, 1/8భాగము నీరు, 1/8 భాగము భూమి.
2.వాయువు :- ప్రధానముగా తీసుకొనినా ½ భాగము వాయువు, 1/8 భాగము ఆకాశము,1/8 భాగము అగ్ని, 1/8 భాగము నీరు,1/8 భాగము భూమి.
3.అగ్ని:- ప్రధానముగా తీసుకొన్న భాగము అగ్ని, 1/8 భాగము ఆకాశము, 1/8 భాగము వాయువు, 1/8 భాగము నీరు,1/8 భాగము భూమి.
4.జలమును:- ప్రధానముగా తీసుకొనిన 1/2 భాగము జలము, 1/8 భాగము ఆకాశము,1/8 భాగము వాయువు,1/8 భాగము అగ్ని, 1/8 భాగము భూమి.
5. భూమిని:- ప్రధానముగా తీసుకొనిన ½ భాగము భూమి, 1/8 భాగము ఆకాశము, 1/8 భాగము వాయువు, 1/8 భాగము అగ్ని, 1/8 భాగము జలము.

పై విధముగా పంచభూత పంచీకరము జరిపిన ఆభావములు తెలియవచ్చును.
కావున
1) ఆకాశమునకు శబ్దగుణము కలదు
2) వాయువుకు శబ్ద, స్పర్శ రెండు గుణములు
3) అగ్ని శబ్ద,స్పర్శ, రూప గుణములను కలిగి ఉంది.
4) జలమునకు శబ్ద, స్పర్శ, రూప, రస రూపములుంటాయి.
5) భూమికి శబ్ద,స్పర్శ, రూప, రస, గంధములనబడే ఐదు గుణములుంటాయి.

కావున పంచభూతములు ఈ సృష్టిలో,సృష్టిచే శక్తిని పొంది ఉన్నాయి. కావున ఈ సృష్టి అంతా పంచ భూతాత్మకము.ఈ పంచ భూతములను ఆధారముగా తీసుకొని ఇరవై అయిదు తత్వములు ఏర్పడ్డాయి వీనినే పంచ వింశతి తత్వము అంటారు. ఎలాగంటే పంచభూత పంచీకరణము ఆధారంగానే పంచ వింశతి తత్వములు వస్తాయి. పరబ్రహ్మము నుండి ఏర్పడిన ఈ పంచభూత పంచ వింశతిని జాగ్రత్తగా గమనిస్తే మనిషి మనుగడ మానవుని నడవడి అర్ధమవుతుంది.

1. ఆకాశము ప్రధానమై రెండు భాగములు చేసిన అందు ½ భాగము ఆకాశధార పరబ్రహ్మము.
మిగిలిన అర్ధభాగములో 1/8 వాయువు ఆధారంగా మనసు

మిగిలిన అర్ధభాగములో 1/8 అగ్ని ఆధారంగా బుద్ధి
మిగిలిన అర్ధభాగములో 1/8 జలము ఆధారంగా చిత్తము
మిగిలిన అర్ధభాగములో 1/8 భూమి ఆధారంగా అహంకారము

2. వాయువు ప్రధానమై రెండు భాగములు చేసిన అందు ½ భాగము ధారంగా ఉదాన వాయువు
మిగిలిన అర్ధభాగములో 1/8 ఆకాశము ఆధారంగా సమానము
మిగిలిన అర్ధభాగములో 1/8 అగ్ని ఆధారంగా వ్యానము
మిగిలిన అర్ధభాగములో 1/8 జలము ఆధారంగా అపానము
మిగిలిన అర్ధభాగములో 1/8 భూమి ఆధారంగా ప్రాణము

3. అగ్ని ప్రధానమైన రెండు భాగములు చేసిన అందు ½ భాగము అగ్ని చక్షువు
మిగిలిన అర్ధభాగములో 1/8 ఆకాశము ఆధారంగా శ్రోత్రము
మిగిలిన అర్ధభాగములో 1/8 వాయువు ఆధారంగా త్వక్కు
మిగిలిన అర్ధభాగములో 1/8 జలము ఆధారంగా జిహ్వా
మిగిలిన అర్ధభాగములో 1/8 భూమి ఆధారంగా ఘ్రాణము

4. జలము ప్రధానమై రెండు భాగములు చేసిన అందు ½ భాగము జలరసము
మిగిలిన అర్ధభాగములో 1/8 ఆకాశము ఆధారంగా శబ్దము
మిగిలిన అర్ధభాగములో 1/8 వాయువు ఆధారంగా స్పర్శ
మిగిలిన అర్ధభాగములో 1/8 అగ్ని ఆధారంగా రూపము
మిగిలిన అర్ధభాగములో 1/8 భూమి ఆధారంగా గంధము.

5. భూమి ప్రధానమై రెండు భాగములు చేసిన అందు ½ భాగము భూమి గుదము.
మిగిలిన అర్ధభాగములో 1/8 ఆకాశము ఆధారంగా వాక్కు
మిగిలిన అర్ధభాగములో 1/8 వాయువు ఆధారంగా పాణి
మిగిలిన అర్ధభాగములో 1/8 అగ్ని ఆధారంగా పాదము
మిగిలిన అర్ధభాగములో 1/8 జలము ఆధారంగా గుహ్యము

ఇలా స్థూల దేహము, సూక్ష్మ దేహము, కారణ శరీరములగుచున్నవి. స్థూల సూక్ష కారణ శరీరముల పైన పరమాత్మ ఉండును